# గీతాంగణము

తెలుఁగులెంక
తుమ్మల సీతారామమూర్తి

ఎల్లషనవులు రచయితవి

మొదటి కూర్పు

విళంబి మాఘము
౧౯౫౯ ఫిబ్రవరి
వెల రూపాయ

భారతీ ప్రెస్
తెనాలి

# రంగవల్లి

భావే 'గీతాప్రవచన'
మీవు తెనుఁగుచేసి బాస కేమో మెఱుఁగుల్
కేవల లాక్షణికమ్ములు
కావలెనని నన్ను నిన్నుఁ గలిపితి వెపుడో

నా మూలమున భవత్కృతి
కేమెఱుఁగులువచ్చె దైవ మెఱుఁగును గానీ
నీమూలమ్మున మత్కృతి
లో మెఱుఁగులు వచ్చి బ్రతుకులోఁతులు కంటిన్

కైతవలపు డించి గీతను జదివించి
నన్నుఁ జేర్చినట్టి యన్న వీవు
ఇంత చేసిచేసి యెంత సౌశీల్యమో
నన్నుఁ బెద్దసేయు పిన్న వీవు

గీత చదువఁ జదువఁ గైతయు నవశమై
పొంగివచ్చి నన్ను లొంగఁదీసె
నింతచేయుఁగాక యిది భయంపడియె గీ
తాంగణమ్ము దాఁటి యడుగుమోవ

ఇది గీతాభవనమ్మున -
గదులన్నిటఁ జొచ్చిచూడఁగలదో లేదో
పదుగుర కిప్పుడే కన్పడి
మదిమది కల్గించెదనుజుమా యని కదలెన్

గీతార్చకు నిను ముఖ్య
శ్రోతను గావించి మెఱయఁజూతును దీనిన్
నా తలఁ పిది పాటింపుము !
నా తృప్తికి సాధుసాధనముగా నగుమా !

ఏమి ఘనకార్య మిది బ్రదుకెల్ల నార్త
సేవకై ధారవోసిన జీవిపట్ల
సూర్యనారాయణా ! సుధాంశునకు నమృత
మిచ్చినాఁడను నాయీవి కెంతవిలువ ?

పైచూపు వలచు ప్రాణికి
లోచూపునుసైత మొసఁగి లోకస్తుతికిన్
నోఁచిన చికిత్సకమణీ !
శౌచఖనీ ! సామ్యయోగసాహిత్యధునీ !

జయ ! జయ ! వెంపటివంశజ !
జయ ! జయ ! సర్వోదయప్రచారస్విన్నా !
జయ ! జయ ! భావేప్రియపథ !
జయ ! జయ ! గాంధేయధర్మసత్యపతాకా !



# గీతాంగణము

## అధ్యాయము ౧

విజయా! కౌరవరాజ
ధ్వజినిన్ గనుఁగొమ్ము గంగతనయుఁ డితఁడు కుం
భజుఁ డాతఁడు కృపుఁ డతఁ డా
భుజబలగర్వితులు సూతపుత్త్రప్రముఖుల్. శ్లో. ౨౫

అచ్యుతుం డిట్లు పల్క రణార్థులైన
తాతలను దండ్రులను సుహృద్వరుల గురుల
బంధువులఁజూచి కారుణ్యభరము, దుఃఖ
భారమలయింపఁ బార్థుఁ డీపగిది నుడివె ౨౬-౨౮

ఈ చుట్టములదెసన్ గన
నా చిత్తము కలఁగు మెయి వణంకెడు నవశం
బై చేతివిల్లు జాఱెడి
నేచందమునన్ వధింతు నిఁక వీరి హరీ! ౨౯-౩౧

వలదు గెలుపు నాకు వనజాక్ష! వసుధయు
వలదు భోగమేని వలదు వలదు
సకలబంధుకోటి చచ్చినపిమ్మట
నేలయేల బ్రదుకదేల చెప్పుమ! ౩౨

ఏమిలగ్గు వొడము నీ ధార్తరాష్ట్రుల
మడియఁజేసినంత మన కనంత!
యెంతకుమతులైన నీ బంధువులఁ జంప
నవధిలేని దురిత మలముకొనదె? 3౭

రాచసిరికి ధార్తరాష్ట్రులు లుబ్ధులై
కులము నణఁపఁ బూనుకొంద్రుగాక
నీరజాక్ష! యింత నేర్చిన మనము వం
శఘ్నులైన చెట్ట సలుపనేల 3౮, ౩౯

కులమున పెద్దలు సమసిన
నలియగు వంశోచితము సనాతనధర్మం
బలఘుమతీ! ధర్మువు చెడ
నలువంబై కులము సర్వ మాఱడిపోవున్ ౪౦

ఆచారములు నశించిన
నీచస్థితి కిచ్చగింత్రు నెలఁతలు; కులకాం
తాచయము పతిత మగుచో
లోఁచెడు వంశమ్ము గడియలో సంకరమై ౪౧

సంకరము వంశమునకు వంశఘ్నులకును
దుర్గతి ఘటించి పితరులదుఃఖమునకుఁ
గారణంబగు నెట్టు లీ ఘోరదురిత
విధికి నొగ్గుదు వివరింపవే! ముకుంద! ౪౪

ఎంతపాపమునకు సంతసకట్టితి
మకట! దొరతనమ్ము, సుకము వలచి
బంధువుల వధింపఁ బాల్పడితిమొ! లోభ
మింత సేయునే! దురంత మగుచు ౪౫

పట్టను ధనుస్సు, కొట్టినఁ
గొట్టను శాత్రవులఁ; గత్తిగొని నిర్దయులై
యుట్టి ననుఁ గౌరవులు తుద
ముట్టింతురుగాక! దాన ముదమే కుడుతున్ ౪౬

# అధ్యాయము ౨

బంధువుల వధింప భయపడి దీల్పడి
కరుణ పొంగి పొంగి కరఁగి కరఁగి
యశ్రుపూర్ణనయనుఁడై కుందు కుంతీకు
మారు నిట్లు తేర్చె మధువిరోధి ౧

ఈమోహ మీవిపద్దశ
నేమెయి నినుఁ జేరెఁ బార్థ! యిది పామరులన్
బ్రాము నపకీర్తిఁ దెచ్చును
గామాదులు మప్పి పుణ్యగతిఁ దప్పించున్ ౨

తగదు విహ్వలింపఁదగ దీవు; నీవంటి
దండి కిట్లు పిఱికితనము తగదు
వదలు మధమమైన హృదయదౌర్బల్యమ్ము
లెమ్ము రిపుభుజావలేప మడఁప ౩

హరి యిట్లన ఫల్గునుఁ డి
ట్లెఱఁగున వాక్రుచ్చె యదుపతీ! భీష్మునిపై
గురుపై శస్త్రము లెవ్విధిఁ
బఱపెద? నర్చింపఁదగినభవ్యులు వారల్ ౪

ఈ గఱువల నెత్తుటిలోఁ
దోఁగిన భోగమ్ములేల దురము వదలి భి
క్షాగతము నిర్మలంబగు
నోగిరమున మనుట మనకు నుచితముకాదో? ౫

ఐన నెవరుగెల్తురో నిర్ణయించుట
యరిది; గెల్పు మనది యగునుగాక
యెవరి నణఁచి బ్రదుక నియ్యానేయమొ వార
లెదుటఁ గలరు కౌరవేంద్రముఖులు ౬

దీనుఁడ నీ శిష్యుఁడ, నిది
యా నిది కా దని వచింప నసమర్థుఁడ ని
న్నే నమ్మితిఁ గర్తవ్య వి
ధానం బెఱిఁగించి నన్నుఁ దనుపవె తండ్రీ! ౭

కలన గెల్చి రాచకలిమి గడించినఁ
జచ్చి యేను సురలసరస నున్న
గురుల బంధుజనులఁ గూల్చితి నని కుంద
వలయు నీయలంత వాయు టెట్లొ? ౮

లోకైకవీరుఁడగు నరుఁ
డీ కరణిం బలికె నిలువ నీతనిఁ దెలుపన్
శ్రీకృష్ణుఁడు చిఱునవ్వుల
జోకలతో నిట్లు తత్త్వశోభలు కురిసెన్ ౯,౧౦

కుందఁదగనివారిఁ గూర్చి దుఃఖింతువు
గొప్పగొప్ప మాట లప్పగింతు
వర్జునా! మనీషు లడలుదురా చన్న
వారికొఱకు నున్నవారికొఱకు ౧౧

నేను నీవు వీరు నేఁటివారమె కాము
యుగయుగాలనుండి యున్నవార
మింద్రజా! యెఱుంగు మీమేను కూలిన
వెనుకనైన మనము వెలయఁగలము ౧౨

ఆత్మకీశరీరమందుఁ బిన్నఱికంబు
జవ్వనంబు ముదిమి యెవ్విధాన
వచ్చు నవ్విధాన వచ్చు దేహాంతర
మిది యెఱింగి ప్రాజ్ఞుఁ డుదిలపడఁడు ౧౩

ఒసఁగు సుఖదుఃఖములను శీతోష్ణగతుల
నింద్రియార్థము; లివి నిల్వ వెల్లకాల;
మొంటుకొనుచుండు మరల దవ్వగుచునుండు
నర్జునా! వీని సైరింపు మాత్రపడక ౧౪

ఏతఁడు సుఖవేదనాది
ద్వితయమ్ముల నొక్కరీతి వీక్షించు, సమా
హితచిత్తవృత్తిమై మను
నతఁడుసుమా! ముక్తిపడయ నర్హుఁడు పార్థా! ౧౫

పొలియు దేహమునకు నిలుకడ లేదు, లే
దమరమైన యాత్మకస్తమయము
తత్త్వవిదులు దీనిఁ దలఁచి నశ్వరమైన
యొడలు పోవుపట్ల నడలుకొనరు ౧౬

అఖిలజగము నందు నలమిన యాత్మకు
లేదు లేదు చావు లేదు పార్థ!
చావు లేనిదీనిఁ జంపువాఁ డెవఁడును
లేఁడు లేఁడు బెగ్గలింప కోయి! ౧౭

నిత్యమై తర్కమునరాని సత్యమైన
యాత్మకు నుపాధులైన కాయములు సమయు
నర్జునా! నీటిబుడగ లయ్యవి; రహస్య
మిది యెఱింగి కడంగుమా కదనమునకు ౧౮

ఒకనిఁ జంప నాత్మ యొకనిచేఁ జావక
కర్తృకర్మగతులు కడచి యుండు
నిది వికారదూర మీగు టెఱుంగని
వారు తెలివిలేనివారు పార్థ! ౧౯

పుట్టుటయు నిల్చుటయు వృద్ధి పొందుటయును
మాఱుటయు సన్నగిలుటయు మడియుటయును
గలుగ వాత్మకు నొడలు పోకారినంత
నాత్మ చావదు నిత్య మియ్యది కిరీటి! ౨౦

ఆత్మ నిత్య మనియు నది చావ దనియును
బుట్ట దనియుఁ గృశత పొంద దనియు
నెవఁ డెఱుంగు నాతఁ డెవని వధించు నె
వ్వానిచేతఁ జచ్చు మానమహిత! ౨౧

ప్రిదిలి చినిఁగిన వస్త్రముల్ వదలివైచి
క్రొత్తవలువల నరుఁడు చేకొనువిధాన
నాత్మయును జీర్ణమైన దేహముల వీడి
యవధరించు నవీనకాయములఁ బార్థ! ౨౨

కఱకుఁగత్తులు దేహిని నఱుకలేవు
శిఖిశిఖాజాలములు బూదిసేయలేవు
ముసురుకొని పొంగువెల్లువల్ ముంపలేవు
అంపిలిన వేఁడిగాడ్పు లెండింపలేవు ౨౩

అంద దీయాత్మ చక్షురాదీంద్రియముల
కిది మనస్సునకును జిక్క దెట్టివికృతి
లేని దిది ఫల్గునా! దీని లెస్స తెలిసి
మానుము విషాద, మూనుమీ మగతనంబు ౨౫

అర్జునా! యొకవేళ నీ వాత్మ మాటి
మాటికిని బుట్టుననియును మ్రందుననియుఁ
దలఁచెదవుగాక! యప్పుడైన నలమటింపఁ
దగిన యక్కఱ లేదుగదా! రవంత ౨౬

జననమందినవానికిఁ జావు తప్ప
దస్తమించువానికి నుదయంబు తప్ప
దిది నివారింపరానిమా ర్గీవు బుధుఁడ
వేల శోకింతు విప్పట్లు బేలవోలె ౨౮

మిత్రమా! వర్తమానచరిత్ర తక్క
భూతముల పూర్వచరిత మజ్ఞాతవిషయ,
మివి నశించినపిమ్మట నెట్టు లగునో
యదియు నజ్ఞాత మిఁక వీని కడలనేల? ౨౯

ఎల్ల మేనులయందు రాజిల్లునాత్మ
చంపరానిదిసు మ్మది శాశ్వతమ్ము
నిక్క మిది యాట నర్జునా! నీవు కుంద
వలవ దీ దేహముల కెదో వచ్చు ననుచు 30

అదిగాక రాచబిడ్డవు
కదనీవు? రణంబు నీకు కార్యంబుకదా?
యిది తక్క నుక్కరికి నె
య్యది మేలిమి? నేల బేలవై వగతు విటన్ 3౧

తెఱచిన స్వర్గద్వారము
కరణిన్ గోరక లభించుఁ గదనము పుణ్య
స్థిరులైన రాచవారికిఁ
బరికింపుము ధర్మబద్ధపథము కిరీటీ! ౩౨

ఇపుడు రణము సేయవేని స్వధర్మంబు
వదలినట్టి చెనఁటివాఁడ వగుదు
వపుడు ముట్టడించు నపకీర్తిఁ గాక దు
ష్పాపభరము నీవు సైఁపవలయు ౩౩

కథలు గాథ లల్లి కలకాల మెల్లరు
తేజుసెడిన నిన్నుఁ దెగడుచుంద్రు
చావుకంటెఁ జెట్ట నావచ్చు విఖ్యాతి
నందుకొన్నవాని కపయశస్సు ౩౪

చచ్చినచో స్వర్గము, రిపు
వ్రచ్చినచో వసుధ నీవు వడయుదు, వింక నీ
వుచ్చముడుంగుట వదలుము
రెచ్చి ధనూరవము నాచరింపుము పార్థా! ౩౫

అస్త్రవిన్నాణీ! జయాపజయమ్ముల
సుఖసుఖేతరములఁ జూడు సమత
నవల విక్రమింపు మాహవ మొనరింపు
మపుడు నిన్ను దురిత మంట వెఱచు ౩౮

ఇంతదనుక నీకు నెఱుకచేసితిఁ జుమా!
యాత్మతత్త్వమునరహస్య మెల్ల
నుగ్గడింతు నిఁకను యోగంబు, నిది కర్మ
బంధములను ద్రెంచు, బలిమి నించు ౩౯

ఇదియె కర్మయోగ మిందు ఫలాసక్తి
చనదు చెడుట దీని సరణి కాదు
సమయఁజేయు బహుళసంసృతిభీతి నీ
ధర్మ మల్పమైన శర్మకరము ౪౦

రాగద్వేషాదుల దెస
కేగని పరిపక్వబుద్ధియే నిలఁబడు నీ
యోగమ్మునఁ; బలుగొమ్మల
సాగెడి వెడతెలివి నిలువఁ జాలదు దీనన్ ౪౧

ఆమ్నాయములు సెప్పు నర్థవాదమ్ములు
పొగడుచుఁ దృష్ణల బ్రుంగి బ్రుంగి
యుత్తమపురుషార్థ మొకస్వర్గమే యని
నమ్మి దానిని మించునది హాళిక్కి

యనుచు నపండితు లఱతురు ఫలముల
నీలేనివిరులతో నింపు నింపు
ప్రాఁకుల కెనవచ్చుమాటల వల్లింత్రు
జననహేతుక్రియల్ చాటువాని;

వానివలఁ జిక్కి భోగముల్ వలచి కామ్య
పద్ధతులఁ బోవు మూర్ఖులబుద్ధి నిశ్చ
యాత్మకము గాక తత్త్వమునందుఁ గర్మ
యోగమునయందు నిలువలేకో హటించు ౨౩-౨౪

శ్రుతులు బోధించుపనులు సంసృతికి నాది
కారణమ్ములు కాన నిష్కామవృత్తి
నెచ్చి సుఖదుఃఖముల దాఁటి నిత్యసత్త్వ
నిష్ఠమై నాత్మతత్త్వంబు నీవు కనుము ౨౫

అర్జునా! వేదవిధు లిచ్చునర్థ మాత్మ
విదున కొనగూడు ముక్తిలో నొదిఁగి యుంట
బావినీటికి నారాటపడఁగ నేల
త్రిపథగాతీరమునఁ గాఁపురించువాఁడు ౪౬

కర్మమందె నీకుఁ గల దధికారంబు
లేదు ఫలమునందు లేశమేని
ఫలము వలచి నీవు సలుపకుమీ కర్మ
మియ్యకొనకు కర్మ మీసడింప ౪౭

మది ఫలాఫలముల నొక్కమైఁ దలంచు
సరణి యోగము నాఁ జెల్లు సవ్యసాచి!
రాగమును వీడి నీ విట్టియోగ మూని
కర్మము లొనర్పుమా! యిది ధర్మ మనుచు ౪౮

సమత నిండిన కర్మయోగమునకంటె
నధమమగుఁ గామ్యకర్మ; మీవిధికి లొంగు
వారు పుట్టుచు గిట్టుచు వగచు దీను
లగుట నిష్కామయోగ మీ వాశ్రయింపు ౪౯

అర్జునా! సమతాబుద్ధి నలరువాని
పజ్జకున్ జన దిచటిపాపంబు పుణ్య;
మట్లగుట నీవు యోగమునందు నిలుము
యోగ మనఁ గర్మములపట్ల నొదవుచదురె! ౫౦

ప్రాజ్ఞు లీ బుద్ధియోగము పట్టి కర్మ
ఫలము నొల్లక సంసారబంధముక్తి
పడసి కుంతీసుతా! నిరుపద్రవంబు
నిత్య మగు లోకమునయందు నిలువఁగలరు ౫౧

ఎపుడు నీ బుద్ధి ఫల్గునా! కృపణమోహ
కలుషమును దాఁటి నైర్మల్యగరిమ నందు
నపుడు విన్నది వినఁదగినట్టిదియును
నీకు నిష్ఫల మని తోఁచి నింపు నెఱుక ౫౨

అదియు నిదియు వినుట నర్జునా! నీ బుద్ధి
కుదురులేని దయ్యె; నిది సమాధి
నెపుడు పీఁటవెట్టు నపుడ నీ వీ కర్మ
యోగఫలము నెఱుక నొంద[illegible]వు ౫౩

## స్థితప్రజ్ఞుఁడు

ఆత్మయోగనిష్ఠుఁ డౌ స్థితప్రజ్ఞుని
భాష యేది? యేమి పలుకు నతఁడు?
వానియునికి యెట్లు వర్తిల్లు? నాతని
నడక యెట్టిదయ్య నందతనయ! ౫౪

మదిని బుట్టు సకలమమకారములు వీడి
యాత్మఁ బ్రత్యగాత్మయందు నిలిపి
జగము మఱచి యెవఁడు సాగయు నాతఁడు స్థిత
ప్రజ్ఞుఁ డనఁగఁ జెల్లుఁ బాండుతనయ! ౫౫

ఇడుమలకుఁ జిక్కి బెంబేలుపడనివాఁడు
సుఖముపట్ల ననాసక్తి చూపువాఁడు
వలపు గగ్గోలు రోసంబు వదలువాఁడు
పార్థ! నుడువఁ బడున్ స్థితప్రజ్ఞుఁ డనుచు ౫౬

తనువుపై జీవనమ్ముపైఁ దగులు నిడక
శుభము లొదవిననాఁడు మెచ్చునకు దిగక
కీడు పైకొన్నపట్టున ఖేదపడక
చెలఁగు మునిబుద్ధియే ప్రతిష్ఠిత కిరీటి! ౫౭

కూర్మ మంగములను గుంచుకైవడి విష
యేచ్ఛమైఁ జరించు నింద్రియముల
నెవఁడు లొంగఁదీయు నింద్రసుతా! స్థిత
ప్రజ్ఞ సుమ్ము వాని ప్రజ్ఞపేరు ౫౮

కూడు నీరు మానుకొన్న దేహికి విష
యములు తొలఁగుఁ గాని యాస తొలఁగ
దతఁడు తత్త్వదర్శి యైననాఁ డాసయు
నుపశమిల్లి పార్థ! యపసరిల్లు ౫౯

ఆత్మదర్శనమ్ము నర్థించునరుఁ డెంత
నేర్చుఁగాక యెంత పేర్చుఁగాక!
యింద్రియములు చిత్తహింసాసమర్థమ్ము
లతని మదిని బల్మి నపహరించు ౬౦

అట్టి యింద్రియముల నరికట్టి మనసు నా
వలన నిల్పి యుండవలెను యోగి
యెవని కింద్రియమ్ములు వశమ్ములో స్థిత
ప్రజ్ఞ సుమ్ము వాని ప్రజ్ఞపేరు ౬౧

విషయముల సేవంచు విడువక చింతించు
నతని కందు సంగ మంకురించు
సంగమునఁ గిరీటి! జనియించుఁ గామంబు
కామమునను రోష మావహిల్లు ౬౨

అర్జునా! రోషమున మోహ మవతరించు
మోహమునఁజేసి మఱపది మోసులెత్తు
మఱపుచే బుద్ధినాశమ్ము జరిగితేని
బుద్ధినాశమునన్ జెడిపోవు నరుఁడు ౬౩

మనసు నణఁచిపట్టుమానిసి తనయాన
కగ్గపడిన యింద్రియములవలనఁ
దనువునిల్పుకొఱకుఁ దగుపాటిసుఖములు
పొందినను బ్రసాద మందఁగలఁడు ౬౪

ఉల్ల మకలంకమైన నయ్యోగి కడుచు
బాధలు పరంతపా! పటాపంచ లగును;
కలఁతలేనిమనమ్ముతో నలరువాని
తెలివి యాత్మాభిముఖమై ప్రతిష్ఠిత మగు ౬౫

ఎడఁద నోర్వనివాని కేర్పడదు బుద్ధి
బుద్ధి కుదురక భావనల్ పుట్టఁబోవు
భావనాసిద్ధి లేక చేపడదు శాంతి
శాంతి కఱవైన సుఖ మెట్లు సంభవించు ౬౬

ఇచ్ఛవచ్చినగతిఁ బోవు నింద్రియముల
సరసఁ బయనించుచిత్తమ్ము పురుషబుద్ధి
నణఁచివైచుఁ బయోధిపై నరుగునావ
నెమరుగాలి యణంచున ట్లింద్రతనయ! ౬౭

కావున నెవండు విషయసౌఖ్యముల దెసకుఁ
బరువులిడు నింద్రియమ్ములగరువ మెల్ల
నణఁచి మరలింపనేర్చునో యట్టివాని
ప్రజ్ఞఁ గుంతీసుతా! స్థితప్రజ్ఞ యంద్రు ౬౮

అజ్ఞుల కగోచరంబగునట్టి యాత్మ
నేమఱక చూచు మౌని; మోహితులదృష్టి
కద్దమైతోఁచు నింద్రియార్థాళిఁ గనక
యోగి నిద్రితుచందాన నుండుఁ బార్థ! ౬౯

ఎన్నినదులు సొచ్చి యెంతపెం పొదవిన
నుదధి యింత తొణఁక కుండునట్లు
కోర్కు లెన్ని చుట్టుకొన్నఁ జలింపని
వాని వలచు శాంతి వలవ దొరుని ౭౦

ఎల్లవాంఛల వదలి నిస్పృహాత నేర్చి
యెవఁ డహంకారమమకారలవము లేక
సంచరించు నతండహో! శాంతిఁ బడయు
ఫల్గునా! నిశ్చలానందపదముఁ బడయు ౭౧

ఇది బ్రహ్మనిష్ఠ; దీనన్
గుదురుకొనిన మోహ మంటుకొనలేదు సుమీ!
తుదిగడియ నైన నీస్థితి
యొదవినపురుషుండు ముక్తి నొందుఁ గిరీటీ! ౭౨

# అధ్యాయము 3

కర్మమునకంటె నెఱుకయే గణ్య మనుచు
నన్నుఁ బ్రేరేచెదేల రణమ్ము సేయ?
నకట! సందిగ్ధమగు పల్కు లాఁపి రెంట
నేది ననుఁ దేర్చునో తెల్పవే! ముకుంద! ౧,౨

అర్జునా! తికమక లస్మదుక్తుల లేవు
తెలియు మాత్మానాత్మధీసమగ్రు
లనఘులు బ్రహ్మచర్యముతోడ నాల్గవ
యాశ్రమమున కేగినట్టివారు

జ్ఞానయోగమున మోక్షము గడించెద రంటి
విషయావలికిఁ జిక్కి విసుపుగోరు
కాఁపులు కర్మయోగమున ముక్తిని గందు
రంటి నీరెంట నత్యయము కలదె

మఱియు నరుఁ డధ్వరాదికర్మములు పూన
కుండినను గర్మశూన్యత నొందలేఁడు
పూని వర్జించినను సిద్ధి పొందలేఁడు
సిద్ధి కర్మానుగతచిత్తశుద్ధిఫలమె ౩,౪

ఒక్కత్రుటి యైనఁ గర్మంబు నుజ్జగించు
వాఁ డెవండును సృష్టిలో లేఁడు లేఁడు
ప్రకృతిసిద్ధగుణములచే సకలభూత
నికర మవశమై కర్మంబు నెఱపు నోయి! ౫

ఎవఁడు కర్మేంద్రియమ్ములవృత్తి నణఁచి
మనసుతో నర్థములను వేమఱు దలంచు
నతఁడు దాంభికుఁ డర్జునా! యతఁడు దొంగ
యతఁడు గోముఖశార్దూల మనఁగఁ జెల్లు ౬

జ్ఞానేంద్రియముల మనమున
నే నరుఁ డరికట్టి ఫలము నెంచక వాణీ
పాణి పదా దీంద్రియములఁ
బూనున్ గర్మముల నతఁడు పొగడంగఁ దగున్ ౭

కాన నీవు నియతకర్మమూనుము పని
మానుకంటె లెస్స పూనుకొంట
చేత లేనినాఁడు నీ తనూయాత్రయు
సాగఁజాలదోయి! సవ్యసాచి ౮

వింటివే ! పార్థ ! భగవదర్పితము కాని
కర్మ మది బంధహేతువై కలఁచుఁ గాన
ముక్తసంగుఁడవై కర్మముల నొనర్చి
యీశ్వరప్రీతి గావింపు మిదియె ముక్తి ౯

అన్నమునఁ బుట్టు జంతువు
లన్నం బబ్దమునఁ బుట్టు నబ్దము యజ్ఞో
త్పన్నము యజ్ఞము కర్మజ
మన్నా ! యజ్ఞంబె విష్ణు వని తెలియఁగదే! ౧౪

పరమాత్మ నెవ్వఁ డెదలో
దరిసించుచుఁ దనియుచున్ ముదంపడుచు నొడల్
మఱచు నతఁ డధ్వరాదులు
నెఱపన్ బని లేదు బ్రహ్మనిష్ఠుఁడు గానన్ ౧౭

బ్రహ్మవిదుఁ డతండు పార్థ! కర్మమ్ములు
సలిపి సంతరించుఫలము లేదు
విడిచి కుడుచునట్టియిడుమయు లేదు భూ
తాళి వాని కొసఁగు మేలు లేదు ౧౮

ముక్తుఁ డతఁడు; నీవు మోక్షార్థి; వగుట ఫ
లాశ విడిచి కర్మ మాచరింపు
మనఘ! నిష్కృతేచ్ఛ మగు కర్మయోగమే
దారిఁ జూపు నాత్మదర్శమునకు ౧౯

సిద్ధి నందిరి జనకాదు లిద్ధచరితు
లర్జునా! కర్మయోగమ్ము నాశ్రయించి
యీవు ప్రాజ్ఞుఁడ వైన నయ్యేదవు గాక
చేయవలెఁ గర్మములు ప్రజాశ్రేయ మెంచి ౨౦

ఉత్తముఁడు పోవుదారికి
వత్తురు సామాన్యజనులు; వాఁ డేగుటిపైఁ
జిత్తము నిడు నాగుటిపైఁ
జిత్తము నిడి లోక మెదురుసెప్పక నడచున్ ౨౧

ఏను గోరఁదగిన దేమి కలదు నాకు
లేని దేమి కలదు దేనికొఱకుఁ
బరితపింప వలయు ఫల్గునా! యే నైనఁ
బను లొనర్తు లోకభద్ర మెంచి ౨౨

ఏ నాదమఱచి యొకనాఁ
డైనను గర్మముల విడుచు టది మూడినచో
మానవు లందఱు తమవిధి
మానుదు రది లోకమునకు మంగళ మగునే ౨౩

ఫలవాంఛ పెరిఁగి పామరుఁ
డలయక పను లాచరించునట్లు మనీషా
కలితుఁడు విశ్వహితార్థము
సలుపవలెన్ గర్మములఁ నజస్రము పార్థా ౨౪

లోకసంగ్రహార్థమై కర్మము లొనర్చు
నెడ బుధుండు శ్రద్ధ విడువరాదు
విడుచునేని పామరుఁడునైత మలసుఁడై
రెంటఁ జెడును దెలివి యంటుకొనక ౨౫

అఖిలకర్మంబులను నాకు నర్పగించి
యెఱుకచేఁ గోరికల నోర్చి యెడఁద నేర్చు
వెఱపు నదలించి పగఱు నివ్వెఱపడంగ
నంగవింపుము విజయా! రణాంగణమున ౩౦

తనధర్మ మెట్టిదైనను
వనరక పురుషుండు తీర్పవలయును దానిన్
బనిఁ జూచి కాదు నిష్ఠం
గని తనియున్ బ్రభుఁడు ముక్తి కరుణించునెడన్ ౩౫

ఇది చేయరానిపని యని
మది యెంతగ మొత్తుకొన్న మనుజుఁడు దురితా
స్పదవృత్తి కొగ్గు నిట నె
య్యది వాని బలాత్కరించు యదువంశమణీ! ౩౬

కామము రజోగుణమ్మునఁ గలుగు, నది ని
రుద్ధ మైనెడఁ గోపంపురూపు దాల్చు
నది మహాశన మది పాపసదన మది వి
రోధి కుంతీసుతా! ముక్తి సాధకునకు ౩౭

కీలి పొగచేత నద్దంబు మైలచేత
గర్భ మది మావిచేతను గప్పఁబడిన
పగిదిఁ గామమ్ముచే మూయఁబడిన దెఱుక
ఫల్గునా! కామమును మించు పగతుఁ డెవఁడు ౩౮

# అధ్యాయము ౪

ఎపుడు ధర్మమునకు హీనత వాటిల్లు
నెపు డధర్మమునకు నేపు వచ్చు
నపుడు నన్ను నేన యస్మదీయం బగు
మాయచే సృజింతు నోయి! పార్థ! ౭

తగువారిడిగులు దీర్పఁగఁ
దెగి సాధులఁ జెఱుచువారి తేజము నార్పన్
జగమున ధర్మువు నిల్పఁగ
యుగయుగమున నే జనించుచుందుఁ గిరీటి! ౮

ఎవ్వ రెవ్విధి న న్నాశ్రయించుచుంద్రు
వారి కారీతి ఫల మిచ్చువాఁడ నేను
బక్షపాత మెఱుఁగ నెప్పట్టునందు
నగుట మనుజులు నమ్మి న న్ననుసరింత్రు ౧౧

గుణములును ధర్మములును గారణము కాఁగ
నరులలో నేర్పరించితి నాల్గుతెగల
నిందు నేఁ గర్త నయ్యు మా ర్పెదియు లేని
వాఁడ నగుట నకర్తనై వడిఁ దనర్తు ౧౩

అర్జునా! నాకుఁ గర్మఫలానురక్తి
లేమిచే నన్నుఁ గర్మముల్ ప్రామలేవు
నిస్పృహోమలు నావలె నేర్చినట్టి
ధీరుఁ గర్మము లంటి బాధింపలేవు ౧౪

కామసంకల్పములు లేని కర్మములను
జేయ నేర్చినపురుషుని చేఁత లెల్ల
నతని జ్ఞానాగ్నిచే బూదియగు నతండు
పండితుఁడు నాఁ జెలంగు నపాస్తవైరి! ౧౯

ఆశలను జయించి యపరిగ్రహము నేర్చి
మనసు నోర్చి యెవఁడు మనుటకొఱకు
వలయుపను లొనర్చు వాఁడు సంసృతిబంధ
మూపదిరిత మందఁ డోపృథాజ! ౨౧

ఎవఁ డయాచితలబ్ధిచేఁ దృప్తి నంది
గెలుపు నోటమి నొక్కమైఁ దలఁచి కష్ట
సుఖసుఖద్వంద్వముల దాఁటి సూడు మఱచు
నతఁడు పని చేయుఁగాక బంధితుఁడు గాఁడు ౨౨

గతసంగులు బ్రహ్మైవ
స్థితబుద్ధులు యజ్ఞదృష్టిఁ జేసెడిపని సం
సృతిహేతువు కాదు ఫలా
న్వితముగ నదియెల్ల నడఁగు విశ్రాంతినిధీ! ౨౩

ద్రవ్యమున నిర్వహించు నశ్వరముకంటె
మానసేయము ఫల్గునా! జ్ఞానయజ్ఞ;
మఖిలకర్మంబులును జ్ఞానమందె కలియు
నెఱుకయే కర్మసంతతి కెల్ల ఫలము ౩౩

ఎగసి మండు నగ్ని యెండినకట్టెలఁ
బొడిచి పొడిచి యెట్లు బూదిసేయు
నట్లు బూదిసేయు నర్జునా! జ్ఞానాగ్ని
సంచితాది కర్మ సంచయముల ౩౭

ఎఱుకలేని పురుషుఁ డెఱిఁగినదానిపై
శ్రద్ధ లేనివాఁడు సంశయాత్ముఁ
డింద్రజా! నశించు నిందైన నందైన
శంకితునకు సుఖము సాధ్యపడము ౪౦

# అధ్యాయము ౫

చేతలు విడుచుట విడవమి
హేతువులే ముక్తి; కైన నీ రెండిటిలోఁ
జేతలు విడవమి యుత్తమ
రీతి యనందగుఁ జుమీ! యరిందమబాహూ! ౨

రాగ మలుకయు లేని కర్మవ్రతుండు
వాసికెక్కును నిత్యసంన్యాసి యనఁగ
సంహృతద్వంద్వుఁ డగుట సంసారబంధ
ముక్తి నందు ననాయాసముఁగ నతండు ౩

జ్ఞాని గడియించు పరమ
స్థానంబే కర్మయోగిసత్తముఁ డందున్
గాన నెవఁ డీ యభిన్నత
కానంగలఁ డతఁడు ప్రాజ్ఞగణ్యుఁడు పార్థా! ౫

ఎవఁ డనాసక్తుఁడై పనులెల్ల నీశ్వ
రార్పితమ్ములు గావించు నతఁడు నీటి
యంటు పడయని తామరపాకు వోలెఁ
బరిఢవిల్లును గిల్బిషస్పర్శలేక ౧౦

విద్య వినయమ్ము గల బ్రహ్మవిదుని మొదవు
నేనికను గుక్కురంబును హీనచరితు
నెతఁడు సమదృష్టిమైఁ జూచు నతఁడె పాండు
రాట్సుతా! పండితుఁ డనంగ రాణకెక్కు ౧౮

మేను లన్నిటఁ బరమాత్మ మెఱయుచుంట
నది విమలమాట నఖిలభూతాళి నొక్క
మాడ్కి నెవఁ డెంచు వాఁడు బ్రహ్మస్థితుండె
వాని కీజన్మమందె కైవసము ముక్తి ౧౯

కామరోషవేగ మే మానవుఁడు మేన
నసువులుండ నైఁచు నణఁచివైచు
నతఁడె యోగివర్యుఁ డతఁడె జీవన్ముక్తుఁ
డతఁడె సత్యసుఖము నందువాఁడు ౨౩

లుప్తకల్మషుండు లూనసంశయుఁడు జి
తేంద్రియుండు లోకహితుఁడు నైన
ఋషికె జననమరణఋతి లేని బ్రహ్మని
ర్వాణసుఖము దక్కు వజ్రితనయ! ౨౫

# అధ్యాయము ౬

“నన్ను నేన చేర్తు నున్నతి” కను దిట్ట
తనము వలయుఁ బిఱికితనము వలదు
తనకుఁ జుట్ట మెవఁడు తాఁగాక తనకు శా
త్రవుఁ డెవండు కలఁడు తాను గాక ౫

ఎవఁడు శమదమసంపత్తి నెనయు నతని
కింద్రియావళి పరమార్థహేతు వగును
సంయమబలమ్ము నేర్వని జనున కదియె
శత్రువై సకలానర్థజనక మగును ౬

ఏకాగ్రత నిర్భీకత
చేకొనవలె బ్రహ్మచారిజీవనమార్గం
బీకొనవలె మది నోర్చి ని
రాకులుఁడై నరుఁడు నన్ను నర్థింపవలెన్ ౧౪

ఎల్లరకు నబ్బునా యోగ మెవఁడు తగిన
తిండి తినుచుండుఁ దగినట్లు తిరుగుచుండుఁ
దగినపని కష్టపడుచుండుఁ దగిననిద్రఁ
దగినజాగర్య నుండు నాతనికిఁ గాక ౧౭

బుద్ధి సుస్థిరమై యుండు పొలుపు నేర్చి
యోగి మెలమెల్ల నుపరతి నొందవలయు
మనసు నతఁ డాత్మలోఁ జేర్చి మఱచి జగము
నందుకొనవలె స్వస్వరూపానుభూతి ౨౮

యోగియై సమదృష్టియై నొప్పు నెవ్వఁ
డతఁడు తనయందు వీక్షించు నఖిల జగము
నఖిలజగమునఁ దా నున్నయదియు నెఱిఁగి
యతఁడు పొందు నభేదపూర్ణానుభూతి ౨౯

అన్నిట ననుఁ దిలకించుచు
నన్నిటి నాయందుఁ జూచు నతఁ డెవ్వఁడొ తత్
సన్నిధి నే నుందును మత్
సన్నిధి నతఁ డుండు నెల్లసమయములందున్ ౩౦

తనకు నాకు భేద మణుమాత్ర లేమి, యే
నఖిలభూతవర్తి నగుట తెలిసి
నన్నుఁ గొలుచు యోగి నాయంద నిలుచుఁ గ
ర్మములు పూనుఁ గాక మానుఁ గాక ౩౧

తనకు మేలైనపని లోకమునకు మేలు
తనకుఁ గీడైనపని లోకమునకుఁ గీడు
నిక్క మిది యంచెఱింగి ప్రాణికి విపత్తు
గూర్పక మెలంగు యోగియే! గొప్పవాఁడు ౩౭

సవ్యసాచీ! మన స్సతిచపల మగుట
నిగ్రహింపఁగరానిది నిజము నిజము
గురుతరాభ్యాసబలమునఁ జిరవిరాగ
పాటవమ్మున నిది వశంపడుఁ గిరీటి! ౩౮

పుణ్యనిధులైనవా రుండు భువనమునకుఁ
జేరి పెక్కేఁడు లచట వసించి శౌచ
వైభవము లక్ష్మియున్ గలవారియింటఁ
బుట్టు యోగచ్యుతుఁడు పాండుభూపతనయ ౪౧

ఎందఱో యోగు లుందు; రం దెవఁడు శ్రద్ధ
ధానుఁడై యంతరాత్మ నాపైని నిల్పి
నన్ను సేవించు నతఁడహో! నాకు నిష్టుఁ
డతఁడహో! యోగిశేఖరుం డగును పార్థ! ౪౨

## అధ్యాయము ౭

వేయింటి కొకఁడు ననుఁ గన
నాయితపడు, నట్టి నరసహస్రమ్ములనయం
దే యొకఁడో ననుఁ గను, మఱ్
జ్ఞేయము నాతత్త్వ మల్పజిజ్ఞాసులకున్ ౩

నేల నీరు నిప్పు గాలి నింగి మనస్సు
ధీ యహంత యన మదీయమైన
ప్రకృతి పార్థ! యష్టభాగములన్ వగుఁ
దెలియు మిదియె సంసృతికిఁ బునాది ౪

ఏన హేతువ నీసృష్టికెల్ల నితర
కారణ మొకింత లేమి నిక్కము కిరీటి!
దారమున మణు లున్నచందమున లోక
మిది సమస్తము నాయందు నొదిఁగియుండు ౭

అఖిలభూతములకు నాదిమబీజంబ
నేను బుధులపాలిమెఱుక నేను
దెలిసికొనఁగదోయి! తేజస్వులై నుతి
కెక్కువారి తేజ మేను పార్థ! ౧౦

గతిఁ దొఱంగినట్టి కామరాగమ్ముల
గెలిచి బలియుఁ డందు బలిమి నేనె
ధర్మమునకు నడ్డుపడగులక ప్రాణియం
దలరు వలపు నేనె దళితవైరి ! ౧౧

ఆధులకు వ్యాధులకు లొంగి యడలువారు
దారసుతకాంచనాదులు కోరువారు
తత్త్వజిజ్ఞాసకలవారు తత్త్వవిదులు
నను భజింతురు పార్థ! యనారతముగ ౧౬

ఈ నాలుతెగలవారల
లో నిశ్చలభక్తిమై వెలుంగుదు రెవ రా
జ్ఞానులు గణ్యులు వారికి
నే నిష్టుఁడ వారు నాకు నిష్టులు విజయా ! ౧౭

పుట్టి గిట్టినవానిని బుట్టియున్న
వాని నిఁకఁ బుట్టఁగలవాని నేను సకల
భూతముల నెఱుఁగుదుఁ గాని నా తెఱంగు
నుడువఁజాలినదిట్ట యొక్కఁడును లేఁడు ౨౬

## అధ్యాయము ౮

మనుజుఁ డేరూపమును సదా మరగి తలఁచు
నతని కారూపమే తోఁచు నంత్యవేళ
దానిఁ జింతించుచు నతండు తనువు నూడ్చుఁ
గానఁ దద్రూపమే పొందఁగలఁడు పిదప ౬

అగుట నెల్లయెడల నర్జునా! నీవు న
న్నే స్మరింపు రిపుల నెదిరి చంపు
నీమనస్సు బుద్ధి నామీఁద నుంతువే
నందఁగలవు నన్ను నజు ననంతు ౭

యోగనిష్ఠఁ బూని యోంకారజప మూని
ననుఁ దలంచుకొనుచుఁ దనువు నూడ్చు
పురుషుఁ డందఁగలఁడు పరమపదంబు న
పాస్త జనన మరణ భయముఁ బార్థ! ౧౩

ఇతరాసంగము నొల్లక
బ్రతుకున దినదినము నన్ను భావించు సమా
హితచిత్తుఁ డైన యోగికి
నతిసులభుఁడ నేను భారతాన్వయతిలకా! ౧౪

# అధ్యాయము ౯

జగతి కేను గతిని సాక్షిని సామిని
హితుఁడఁ బోషకుండ నింటి నండ
నుదయమను గిరీటి! యునికిని మిత్తిని
నష్టిలేనిగింజ నిష్టనిధిని ౧౮

అన్యదైవతముల నర్థింప కెవరు న
న్నాశ్రయించి కొల్తు రనవరతము
వలచి వలచి యేను వారి యోగక్షేమ
భరమునెల్లసైతుఁ బాండుతనయ! ౨౨

అర్జునా! భక్తిసంపన్నుఁ డస్మదర్థ
మొసఁగునది పత్రమో పుష్పమో ఫలంబొ
నీరమో యైన నగుఁగాక! నేను దాని
నాదరింతు సుఖమ్ముగా నారగింతు ౨౬

నీవు కావించుకర్మము నీవు మెసవు
నన్నమును నీవు వేల్చుహవ్యమును నీవు
పంచునీవిని నీ వొనరించుతపము
నర్జునా! నాకు నర్పింపు మదియె పూజ ౨౭

భూతములనెల్ల సమదృష్టిఁ జూతు నేను
లేఁడు పగవాఁడు చుట్టము లేఁడు నాకు
భక్తిమై నన్ను సేవించువాని కగ్గ
పడెద నేను నాకతఁ డగ్గపడుఁ గిరీటి ! ౨౯

కుజనుఁ డయ్యు నన్యభజన మొల్లక నన్నుఁ
గొలుచువాని సుజనువలె గణింతు
నతఁడు ఫల్గునా! దురాచారుఁ డయ్యు నా
ప్రాపు వడయ నార్తి షడెఁగ దోయి! ౩౦

నన్నుఁ గొలుచునతని కున్న దురాచార
నిరతి పెక్కువాళ్ళు నిలువఁబోదు
సరగ నతఁడు ధర్మసరణికి వచ్చు న
శ్రాంతశాంతి వడయు నింత చెడఁడు ౩౧

మనసు నాయందు నిల్పుము మామకీన
భక్తుఁడవు గమ్ము మత్పూజఁ బాదుకొనుము
నాకు మ్రొక్కుము వే షేల నన్ను వలతు
వేని నాచెంతనే వసియింతు వీవు ౩౪

# అధ్యాయము ౧౦

జగదుత్పత్తికి విశ్వ
ప్రగతికి మూలంబ నేను, బ్రజ్ఞానిధు లీ
వగ దెలిసి తలఁపు నాపైఁ
దగులన్ ననుఁ గొల్చుచుంద్రు తత్త్వాభిరతిన్ ౮

మనసు ప్రాణంబు నాకు సర్పణమొనర్చి
న న్నెఱింగినపురుషు లున్నారు కొంద
ఱర్జునా! యట్టివార లన్యోన్యగురువు
లగుచు నను మెచ్చుచున్ దృప్తి నందుచుంద్రు ౯

నన్ను విశ్వసించి నాసేవఁ జేయు ము
ముక్షువులకుఁ దత్త్వదీక్షితులకుఁ
దెలివి నిత్తు నన్నుఁ దెలిసికొనం దగు
బలిమి నిత్తు నాదు చెలిమి నిత్తు ౧౦

నన్నుఁ గొలుచువారి మన్నింతుఁ గరుణింతు
వారితలఁపునందుఁ జేరి యుందు
నణఁచివైతు వారి యజ్ఞానతిమిరంబు
దీప్తిమయ వివేకదీపశిఖల ౧౧

అఖిలభూతములందలి యాత్మ నేన
సకలభూత పరంపరా స్రష్ట నేన
సర్వభూతమ్ములకును బోషకుఁడ నేన
యెల్లభూతములకు హంత నేన పార్థ! ౨౦

సుమత! యాదిత్యులందు విష్ణువను నేన
తేజములలో సహస్రదీధితిని నేన
వాయువులలో మరీచి నౌవాఁడ నేన
తారకలయందుఁ గుముదబాంధవుఁడ నేన ౨౧

శ్రుతులలో సామవేదసంహితను నేన
సురసమాజములో శచీవరుఁడ నేన
యింద్రియావళిలో మన స్సేన పార్థ!
జంతువులలోని చైతన్యశక్తి నేన ౨౨

పలుపలుకు లేల వైభవ బల వికాస
విక్రమ శ్రీ సమృద్ధమై వెలయు వస్తు
వేది కల దది నా తేజ మించుకంత
చెందినట్టిద యని విశ్వసింపు పార్థ! ౪౧

# అధ్యాయము ౧౧

ఈవు నావిశ్వరూపము నెట్లు కనెదు
కవ్వడీ! ప్రాకృతంబగు కంటితోడ
నచ్చమగు దివ్యదృష్టి నీ కిచ్చుచుంటి
నిఁక విలోకింపవోయి! మామకమహత్త్వ ౮

వేల్పులను గంటి నీమేన వివిధజంతు
సంతతులఁ గంటి వారిజాసనుని గంటిఁ
గమలలోచన! ఋషులను గంటి దివ్య
ఫణులఁ గంటిని వాసుకిప్రముఖములను ౧౫

పెక్కుచేతులు బొజ్జలు ముక్కులును మొ
గాలుఁ గన్నులుఁ గల నిన్నుఁ గంటిఁ గాని
పాపభంజక మీ విశ్వరూపమునకు
నాదిమధ్యాంతములఁ గాన నైతి దేవ! ౧౬

తత్త్వమవు నీవు తెలిసికోఁదగిన మేటి
వీవు జగతికి నాధార మీవు చెడని
వాఁడ వీవు ధర్మ్మువుఁ గాచు ప్రోడ వీవు
తండ్రి! నా దృష్టిలో సనాతనుఁడ వీవు ౧౮

ఆదిమధ్యాంతరహితు ననంతవీర్యు
నపరిమితబాహు నర్కచంద్రాక్షు నుజ్జ్వ
లాగ్నిముఖు నిన్నుఁ గంటి దేవా! త్వదీయ
తేజమున వేఁగుచున్నది యీజగమ్ము ౧౯

ఒక్కనీ వీ సమస్తరోదోంతరమున
దిక్కులన్నిట అంపిల్లితివి మహాత్మ!
విస్మయకరమ్ము భయద మీ విశ్వరూప
మునకు లోకత్రయమ్మును వణఁకు నకట ౨౦

మహిభరమ్ము డింప మనుజులై యీరణ
క్షోణినిల్చియున్న సురలనెల్ల
నిఖిలభువనమూర్తి! నీయందుఁ జూచెద
వెఱచువారి నిన్ను వేఁడువారి ౨౧

బహుముఖమ్ములు జఠరముల్ పదము లుగ్ర
దంష్ట్ర లివియేమి దేవకీతనయ! నీదు
పొడవు గని ప్రాణిలోకముల్ వడఁకుచుండె
నక్కటా! యేనుసైత మల్లాడుచుంటి ౨౩

ఈకౌరవు లీభీష్ముం
డీ కర్ణుఁడు నాకుఁగూర్చు ధృష్టద్యుమ్నుం
డో కృష్ణ! నీదుకోఱల
తాఁకునఁజెకుచున్న వారుతలలూడిపడన్ ౨౮, ౨౯

నీవు మ్రొక్కువాఁడ నా కోర్కె మన్నించి
సుప్రసన్నమూర్తిఁ జూపుమయ్య
యెవఁడ వీవు ఘోర మీరూప మేమి ని
న్నాద్య నెఱుఁగ వలతు నంజలింతు ౩౦

బలిమిమై లోకములనెల్లఁ బట్టికూల్చు
కాలమను నేను మనముందు కత్తిపట్టి
నిలువఁబడినట్టి యోధుల నీవు చంప
కుండెదవుగాక! పార్థ! వా రుంట కల్ల ౩౧

కావున లెమ్ము రణక్రియ
కావింపుము రిపులగెల్చి గౌరవసౌఖ్య
శ్రీ వాలింపుము పార్థా!
నీవు నిమిత్తమవ తీర్తు నే నఖిలమ్మున్ ౩౩

ఆదిదేవుఁడ వీవు కృష్ణా! పురాణ
పూరుషుఁడ వాశ్రయుండ వీ భువనములకు
వేద్యమవు వేత్త వపవర్గవీథి వఖిల
జగతి నలమిన యమరతేజంబ వదిర! ౩౮

అనిలుఁడవు నీవు యముఁడ వీ వగ్ని వీవు
వరుణుఁడవు నీవు శశి వీవు వనజయోని
వీవు తజ్జనకుండవు నీవు నీకు
మ్రొక్కులివె కొమ్ము వేనవేల్ మ్రొక్కులివిగో! ౩౯

నీవు సర్వస్వరూపుఁడ వీ వనంత
వీర్యుఁడ వపారవిక్రాంతివిలసితుఁడవు
దేవ! నీకు జోహారు వేదెస నొనర్తు
నెల్లదెసల సమర్పించి తృప్తిపడెద ౪౦

ఈ చరాచరజగమున కీవు పితవు
పూజ్యుఁడవు మహాగురుఁడ వీ భువనములను
నీకు సరివాఁడె లేఁడిఁక నిన్ను మించు
వేల్పు కనిపించునా యెంత వెదకికొనిన ౪౩

కాన సాఁగిలి మ్రొక్కి నీకరుణ గాంతు
నీశ్వరా! తండ్రి కొమరుని యొగ్గు, సఖుఁడు
సఖుని దోసము, చెలువుండు చానదొసఁగు
సైఁచినట్టులు నాతప్పు సైఁపవయ్య! ౪౪

నీవు నేఁడు కన్న నా విశ్వరూపంబు
శ్రుతులకతనఁ దపముకతన నీవి
కతన నధ్వరమ్ముకతనఁ జూచెద మని
వనరువారు వెఱ్ఱివారు పార్థ! ౫౩

ఫల్గునా! యనన్యభక్తిచేతనె విశ్వ
రూపు నన్ను జను లెఱుంగఁగలరు
కానఁగలరు పొందఁగల రిది యేకైక
సాధనంబు మత్ప్రసాదమునకు ౫౪

ఎవఁడు మత్ప్రీతికై సేయు నెల్లపనుల
నెవఁడు నను మేలిప్రాపుఁగా నెంచు నిరత
మెవఁడు భజియించు నిస్సంగుఁ డెవఁడు సర్వ
భూతహితుఁ డెవ్వఁ డతఁడె నాపొందు వడయు ౫౫

# అధ్యాయము ౧౨

సగుణ నిర్గుణోపాస నాసక్తులైన
వార లిద్దఱు ననుఁ జేరువారె కాని
నిర్గుణబ్రహ్మమున మది నిల్పువారు
మిగుల వేసారవలయుఁ జుమీ! కిరీటి! ౨-౫

ఎవఁడు నన్ను నమ్మి యెల్లకర్మముల నా
పా లొనర్చి సగుణభక్తి నేర్చి
ననుఁ దలంచు నింద్రనందనా! వానిఁ ద
ప్పింతు జనన మరణ పీడనుండి ౬,౭

ఓపార్థ! నీదుచిత్తము
నాపై లగ్నము నొనర్చు నైపుణి నీకున్
జేపడదేని కలంగక
యాపన్నతఁ బడక నేర్పు మభ్యాసవిధిన్ ౯

అర్జునా! నీకు నభ్యాస మరిది యైన
నాచరింపుము నాకొఱ కన్నిపనుల
నదియు దుర్లభ మని యందువా! ఫలాను
రక్తి విడి నన్ను నమ్మి కర్మము లొనర్పు ౧౦,౧౧

మానధనా! యభ్యాసము
జ్ఞానము ధ్యానంబు ఫలవిసర్జనములఁ బోఁ
బో నొకటికంటె నొకటి ప్ర
ధానము; ఫలరక్తి లేమి తనువును ముక్తిన్ ౧౨

సర్వభూతములను సమదృష్టిఁ గన్గొని
కష్టసుఖము లొక్కగతిని దలఁచి
నిర్మమత్వ మోర్మి నిరహంత నేర్చి మ
ద్భక్తుఁ డెవ్వఁ డగునో వాని వలతు ౧౩

తృప్తి విడక యోగదీక్ష మానక సక
లేంద్రియములఁ గదలనీక తన మ
నస్సు బుద్ధి నెవఁడు నాయందు నిల్పి మద్
భక్తుఁ డగునో వాని వలతు నేను ౧౪

ఎవనివలన వెఱవ రీప్రజ లెవ్వఁ డీ
ప్రజలవలన డిల్లపడక యుండు
నెవఁడు హర్షమునకు నీర్ష్యకు భీతికి
నెడసి యుండు నస్మదిష్టుఁ డతఁడు ౧౫

కోరికలు వీడి శౌచమ్ము కూర్చుకొని స
మర్థుఁడు తటస్థుఁడై దిగుల్ మాని సకల
కర్మములఁ బాసి మద్భక్తి కలిగి యుండు
నెవ్వఁ డాతఁడు నాచుట్ట మింద్రతనయ! ౧౬

పొంగక యలుగక వెతలన్
గ్రుంగక యప్రాప్తఫలము కోరక చెడుగున్
మంగళ మంటక మద్భ
క్తిం గొని యెవఁ డుండు నతఁడు తీపగు నాకున్ ౧౭

ఎవఁడు నిస్సంగుఁడై హితాహితుల నెండ
వానలను గష్టసుఖముల మాన విప్ర
కారములఁ దుల్యదృష్టితోఁ గని మదీయ
భక్తి మరగు నతండు నా బాంధవుండు ౧౮

ఎతఁడు నిందాస్తుతుల నొక్కగతిఁ దలంచి
మౌనియై తన కబ్బినదానఁ దనిసి
తిరముగా నెందు నిలక బుద్ధిని గుదిర్చి
నను భజించు నతండు నా నెనరువాఁడు ౧౯

# అధ్యాయము ౧౩

క్షేత్ర మనం జను నీమెయి;
క్షేత్రజ్ఞుం డగును దీనికీ ల్గనువాఁ; డీ
క్షేత్రమ్ములఁ గల నేనే
క్షేత్రజ్ఞుఁడ; దీనిఁ గనుట చెల్లు నెఱుకయై ౧,౨

పంచభూతమ్ములు ప్రకృతి యహంత
బుద్ధి దశేంద్రియంబులు మానసంబు
విషయమ్ములై దిచ్చ వేరము సుఖము
దిగులు దేహేంద్రియాదికదంబకమ్ము

చేతన ధృతియు నాఁ జెల్లు ని వెల్లఁ
గలసి క్షేత్రం బాయెఁ గవ్వడీ! వినుము
జ్ఞాను లజ్ఞానులు సర్వజంతువులు
వికృతిబద్ధము దీని విడువంగవలయు ౫,౬

తన్ను మెచ్చుకోనమి దంభ మీకోనమి య
హింస యోర్మి ఋజుత యింద్రియముల
గెలువు గురుసపర్య మలినతలేమి ని
శ్చలత జ్ఞాన మనఁగఁ జనుఁ గిరీటి! ౭

విషయవాంఛ లెల్ల విడుచుట వినయమ్ము
జన్మమునను మృతిని జరను రోగ
మున విషాదమునను బెనఁగొన్న చేటు క
న్గొనుట జ్ఞాన మనఁగ జనుఁ గిరీటి! ౮

సుఖము లొల్లమియును సతీసుతగృహాదు
లాసపడమియు నిష్టార్థ మబ్బునెడ న
నిష్టఫల మంటుతఱి భిన్నదృష్టి లేని
పగిది నుంటయు నెఱుక నాఁ దగును పార్థ! ౯

ఇతర దైవచింత యెఱుఁగక నిష్కంప
భక్తి నన్నుఁ గొలువఁ బట్టుగొనుట
పామర ప్రజాళిఁ బాయుట విజనోర్వి
నుంట జ్ఞాన మనఁగ నొప్పుఁ బార్థ! ౧౦

నిరత మాత్మస్వరూపంబు నెఱుఁగఁ దగుల
మందుటయుఁ దత్త్వసందర్శనాభిరతియు
నర్జునా! జ్ఞాన మనఁ జెల్లు నన్యమెల్లఁ
బరఁగు నజ్ఞాన మనుపేరఁ బలుకరింప ౧౧

ఈశ్వరుండు జగతి నెల్లభూతములందుఁ
గలఁడు భూతకోటి పొలియువేళ
నతఁడు పొలియఁ డమరుఁ డతఁ డన్న యెఱుక చే
కొన్నవాఁడె నిజము గన్నవాఁడు ౨౮

భూతములనెల్ల నెలకొన్నపురుషు నీశుఁ
జూడనేర్చిన శేముషీశోభితుండు
తన్నుఁ దాఁ జంపుకొనఁడు పృథాకుమార!
చేరు నతఁ డూర్ధ్వగతికి నిక్కారణమున ౨౯

అర్జునా! సర్వగత మయ్యు నాకసంబు
సూక్ష్మతర మౌట నెట్లు వస్తువుల నంట
దట్లె దేహములందెల్ల నాత్మ నిలిచి
కర్మలేపము లేనిదై క్రాలు నోయి! ౩౨

ఇంతవిశ్వమునకు నినుఁ డొకఁడే వెల్గు
నిచ్చుపగిది దేహి యీసమస్త
దేహములకు నొసఁగు దీధితి తద్గుణ
దోషములకు దూరదూర మగుచు ౩౩

# అధ్యాయము ౧౪

త్రిగుణబద్ధము ప్రకృతి మదీయ; మది స
మస్తయోనులఁ బుట్టు దేహములతల్లి
యేను దన్మూర్తులందు మే లెంచి యెంచి
విత్తనము చల్లు తండ్రి నో వీరమాళి! ౪

మూర్తులే కాక ప్రకృతికి ముద్దుగూర్చు
సత్త్వము రజస్సు తమము నాఁ జనెడిబిడ్డ;
లర్జునా! నిర్వికారుఁడై యలరు జీవు
నవి నిబంధించుచుండు దేహమునయందు ౫

నిరుపద్రవమై నిర్మల
తరమై సత్త్వము రహించుఁ దద్గుణ మాత్మన్
బెరయించును సౌఖ్యమ్మున
నిరవధికజ్ఞానమున వినీతప్రవరా! ౬

రాగాత్మకము రజ స్సది
భోగాదులమీఁదివలపు పుట్టించుఁ దద
ర్ధాగతి కలయక సాలయక
సాగించును దేహి కర్మచయమును బార్ధా! ౭

విను మజ్ఞానజము తమో
గుణ మిది మోహమ్ము గలిపి కుంచును దేహిన్
గునుకుటయు నేమఱిల్లుట
యును మాల్గుటయును గిరీటి! యొదవును దీనన్ ౮

సుఖమునందుఁ జేర్చుఁ జుమి సత్త్వ మాత్మను
గర్మగతికి నంపుఁగద రజస్సు
తమము తెలివినెల్ల దాఁచి ప్రమాదంపు
దెసకు నీడ్చు, నసుర దీనిఁ గొలుచు ౯

దేహకారణములఁ ద్రిగుణమ్ముల నతిక్ర
మించి దేహి జన్మమృత్యుబాధ
లుత్తరించి శాంతియుక్తుఁడై నిర్వాణ
పదమునందు నిలుచుఁ బాండుతనయ! ౨౦

నందనందనా! గుణత్రయదూరుఁడై
యొసఁగువానిచిన్నె లెట్టు లుండు
నతనినడత లెట్టి వతఁడు గుణమ్ముల
కవల నెట్లు నిల్చు నానతిమ్ము ౨౧

త్రిగుణభవము లైన తెలివియు లోభంబు
నజ్ఞతయు ఘటిల్ల నలుకసెంద
కవి తొలంగ నెవ్వఁ డడలకుండునో గుణా
తీతుఁ డతఁడు విక్రమాతిరమ్య! ౨౨

అగ్గలించి గుణము లాత్మధర్మంబు లొ
నర్చుపట్ల నెవఁడు నగమువోలెఁ
గదలఁబోక తగులుగనకుండునో గుణా
తీతుఁ డతఁడు విక్రమాతిరమ్య! ౨౩

తిట్టు మెచ్చుపలుకు, మట్టి బంగార, మ
నిష్ట మిష్ట, మార్తి హృష్టిపట్ల
నేకరీతి నెవ్వఁ డీకొనునో గుణా
తీతుఁ డతఁడు విక్రమాతిరమ్య! ౨౪

మిత్రు శత్రు నొక్కమెయిఁ గని మానావ
మానయుగళి నొక్కమైఁ దలంచి
యెల్లపనులు వదలి యెవఁ డుండునో గుణా
తీతుఁ డతఁడు విక్రమాతిరమ్య! ౨౫

## అధ్యాయము ౧౫

నిర్మానులు నిస్సంగులు
నిర్మోహులు తత్త్వయోగనిరతులు సుఖదుః
ఖోర్ముల నొకరీతిం గను
నోర్మి గలా రందుకొందు రుత్తమపదమున్ ౫

పరమపద మది రవిసుధాకిరణవహ్ను
లచటికి వెలుంగు నీయలే రందుఁ జొచ్చు
వారు మరలరు జన్మాదిభారములకు
నదియ నా నిల్చుతావు శూరాగ్రగణ్య! ౬

ఏను మహిఁ జేరి నాచేవ నీసమస్త
భూతములవ్రేఁగు నర్జునా! సైఁతు నేన
రసమయశశాంకమూర్తినై యొసఁగి పుష్టి
యొసఁగుచున్నాఁడ నీ సకలౌషధులకు ౧౩

అగ్నినై యేను సకలదేహములఁ జొచ్చి
ప్రాణము నపానమును నన్ను బలసి విసర
నగ్గలించి చతుర్విధాహారములను
గ్రాఁచి కరఁగింతు నఱిగింతు గాండివాంక! ౧౪

క్షరుఁ డక్షరుఁ డన నిద్దఱు
పురుషులు గల రీ సమస్తభూతావలియే
క్షరుఁ; డక్షరుఁ డీ భూత
స్థిరుఁడై తగు నాత్మయే విశిష్టచరిత్రా! ౧౬

వీరికంటె నుత్తముఁడైన పూరుషుండు
కలఁ డొకఁడు పరమాత్మ నా నలరు నాతఁ
డవ్యయుఁ డతండు పరమేశుఁ డతఁడు సర్వ
భువనములఁ జేరి భరియించుప్రోడ యతఁడు ౧౭

క్షరుని మీఱినవాఁడ నక్షరునికంటె
నుత్తముఁడ నేన కాన వేదోక్తులందు
నఖిలజగములఁ బురుషోత్తమాభిధాన
కీర్తితుఁడ నైతి నేను ధిక్కృతపినాకి! ౧౮

అర్జునా! విను మెవఁడు మోహమును విడిచి
నన్నుఁ బురుషోత్తమునిగా మనమ్మునందు
నమ్ము నాతఁడు సర్వజ్ఞుఁ డమ్మనీషి
యెల్లరీతుల ననుఁ జేరు నింత నిజము ౧౯

నిర్భీకతయుఁ జిత్తనిర్మలతయు జ్ఞాన
యోగనిష్ఠయు నీవియును దమంబు
సవనమ్ము ప్రాఁబల్కుచదువుట తపము బు
జుత్వ మహింసయు సూనృతంబు

నలుగకుంటయు సంగములు వీడుటయు నంత
రింద్రియనిగ్రహం బితరుతప్పు
వెదకమి కరుణయు విషయసన్నిధిఁ జలిం
పమి మృదుత్వము సిగ్గుపడుట చపల

బుద్ధి లేక యుంట యుద్ధతేజము సైఁపు
ధైర్యశౌచవిధు లకార్యవిరతి
పొగరులేమి పాండుపుత్రకా! దైవసం
పదను బుట్టువానిఁ బాయకుండు ౧,౨,౩

మరగుమరు దంభదర్పాభిమానములను
వలతు రల్కను బరుషముల్ వలుకుచుంద్రు
యుక్తము నయుక్తమును గానకుందు రెండు
నసురసంపదతోఁ బుట్టినట్టివారు ౪

దైవసంపద ముక్తిపదంబుఁ జూపు
నసురసంపద సంసృతి నంటఁగట్టు
నింద్రజా! బెగ్గడిల్లకు మీవు దైవ
సంపదను బుట్టితివి సదాచారఖనివి ౫

జనులు కొందఱు దైవాంశమున జనింతు
రాసురాంశమునన్ గొంద ఱవతరింత్రు
తెలిపితిని మున్ను మొదటివారల తెఱంగు
నిపుడు రెండవవారి తీ రెల్ల వినుతు ౬

రాక్షసాంశజులందుఁ గర్మప్రవృత్తి
లేదు కర్మనివృత్తియు లేదు శౌచ
నిరతి లేదు సదాచారనియతి లేదు
సత్యసంసక్తియును లేదు సవ్యసాచి ౭

ఈ జగ మసత్య మిద్దాని కీశ్వరుండు
లేఁడు లేఁడు ప్రతిష్ఠయు లేదు మగువ
మగఁడు కూడిన నిది పుట్టు మరులె దీని
వి త్తని వచింతు రసురసంపత్తివారు ౮

నాస్తికత నిట్లు మరగి నష్టాత్ము లల్ప
బుద్ధులై దైత్యసంపదఁ బుట్టువారు
మహికి హింసాదిఘోరకర్మము లొనర్చి
వైరులై చేటు తెచ్చుచున్నారు పార్థ! ౯

దంభమానమదమ్ములఁ దగిలి తగిలి
సీమ నెఱుఁగని తృష్ణలోఁ జిక్కి చిక్కి
యజ్ఞులై వీరు దుర్విధు లాశ్రయించి
నీచదేవతల భజింత్రు నిధులకొఱకు ౧౦

అధమమ్ము లగు విషయానందములు వీరి
పరమార్థములు వీనిఁ బడయుకొఱకు
దరిలేనిచింత నుందురు వీరు కోరికల్
పదులు వందలు వీరి నదిమిపట్టు

రాగవైరమ్ము లారాధ్యముల్ వీరికిఁ
దమసుఖమున కెట్టితప్పు నైన
వెఱవక సాగించి వీరు పరార్థముల్
గడియింపఁ జూతు రీ కలిమి నేము

సంతరించితి మీ మహైశ్వర్యమునకు
నధిపతుల మేము మా మనోరథము లెల్లఁ
దీఱు నని పొంగుచుందు రీ తీరువారు
కామదాసులు వీరు నిక్కము కిరీటి! ౧౧-౧౩

ఏను జంపితి నీవైరి నితరశత్రు
తతి నడంచెద నే సమర్థత గలాఁడ
నేను భోగిని బలశాలి నేను బలఁగ
మున్నదార నంచు నీజాతిదున్న నిక్క ౧౪

కలిమి గలవాఁడ సద్వంశగరిమవాఁడ
నెదురు నా కెవ్వఁ డేను జేసెద మఖమ్ము
నేను దాతను హర్షింతు నే నటంచుఁ
బార్థ! యీ తెగవాఁడు దర్పము వెలార్చు ౧౫

పలుతెఱంగులఁ దనమది కలఁగి యుంట
నెట్టుకొని మోహములు తన్నుఁ జుట్టుకొంట
విషయసంసక్తి తన కతివేల మగుట
నీతఁ డిటు ప్రేలి దుర్గతి కేగుఁ బార్థ! ౧౬

ఇతఁడు తన్నుఁ దాన నుతిచేసికొను మాన్యు
మందలించు విత్తమదముఁ జూపు
మచ్చరించి నామమాత్రయజ్ఞములకు
మొదలుపెట్టు దంభమునఁ గిరీటి ! ౧౭

గర్వపాటవములఁ గామరోషంబుల
నాశ్రయించి యాతఁ డాత్మదేహ
పరశరీరములను భాసిల్లు నాదెస
నలుకగొను నసూయ కగ్గపడుచు ౧౮

క్రూరుఁడు నరాధముఁడు శుభదూరుఁ డస్మ
దహితుఁ డగు వీని సంసృతి కంటఁగట్టి
యసురయోనులఁ బుట్టింతు ననవరతము
జననమరణాదివేదనల్ సందడింప ౧౯

ప్రతిజన్మమునందు నధో
గతికిం జను వీఁడు నన్నుఁ గనలేఁ డెపుడున్
మతిహీనుల బ్రతు కిట్టిది
దితిజాంశజు లైనవారి తెఱఁ గిట్టి దయా ! ౨౦

కామము రోషము లోభము
నా మూఁడుపథమ్ము లుండె నరకమ్మునకున్
ధీమంతుఁడు వీనికి ద
వ్వై మనవలె నాత్మ నణఁచు నరు లివి పార్థా! ౨౧

అర్జునా! విను మెవ్వఁ డీ యవగుణత్ర
యమ్మునకు దవ్వుగా నుండు నాతఁ డాత్మ
హితము లగు కర్మములు పూని యొలమి కెల్ల
నెల్ల యగు ముక్తి నంది రాజిల్లఁగలఁడు ౨౨

ఎవఁడు శాస్త్రీయవిధి వీడి యిచ్ఛవచ్చి
నట్లు వర్తించు ఫల్గునా! యతఁడు సిద్ధి
నొందఁజాలఁడు సుఖములు పొందఁ జాలఁ
డందఁజాలఁడు పరమపదానుభూతి ౨౩

కాన శాస్త్రమునకు గౌరవ మిడి సదా
మంచిచెడ్డపనుల నెంచుకొమ్ము
శాస్త్రవిహితకర్మచణుఁడవై మెలఁగుము
తగుము దైవసంపదలు వరింప ౨౪

## అధ్యాయము ౧౭

సాత్త్వికులు దేవతాపూజ సలుపుచుంద్రు
రాజసులు గొల్చెదరు యక్షరాక్షసులను
తామసులు ప్రేతములకు భూతముల కర్చ
నెఱపుదురు సద్వ్యాచార కుంతీకుమార! ౪

వేల్పులను దేశికులను సేవించుటయును
శౌచదీక్షయు నార్జవాసక్తతయును
బ్రహ్మచర్యవ్రతంబును బ్రాణిహింస
మానుటయుఁ బార్థ! దైహిక మైన తపము ౧౪

ఒరులచిత్తమునకు నొప్పి దొరలకుండ
సరసమును సత్యమును శుభంకరము నైన
సరణిఁ బల్కుట వేదముల్ చదువుటయును
బార్థ! వాగ్రూప మైన తపమ్ము సుమ్ము ౧౫

అనఘమై సుప్రసన్నమై యలరు నెదయు
మంచినడతయు మౌనంబు మదిని గెల్వ
నోపుటయు వంచనాదుల నొల్లమియును
మానసిక మైన తపము సుమా! కిరీటి! ౧౬

# అధ్యాయము ౧౮

అశ్వమేధాది కామ్యకర్మాళినెల్ల
నుజ్జగించుట సంన్యాస మోయి! విజయ!
ఫలము గోరక కర్మముల్ సలుపుచుంట
త్యాగ మనఁ జెల్లునోయి! పృథాకుమార! ౨

కర్మములు దోషమయములు కాన వాని
విడువ నౌ నని కొందఱు నుడువుచుంద్రు
దానము తపమ్ము యజనమ్ము మానరాని
పను లనుచుఁ గొంద ఱర్జునా! పలుకుచుంద్రు ౩

ఏను మెత్తు యజ్ఞదానతపమ్ముల
నెడయరానిచేఁత లివి కిరీటి!
ఫలము విడిచి వీని సలుపువానికిఁ జిత్త
శుద్ధి హెచ్చు జ్ఞానసిద్ధి వచ్చు ౫

విహితకర్మములను విడువరా దవి బంధ
కారణములు కావు కావు పార్థ!
మోహ మెగసి వీని ముడుఁచుట తామస
త్యాగ మండ్రు ధర్మతత్త్వవిదులు ౭

మెయి నలంచు ననుచు భయదుఃఖకారణ
మనుచు నెవఁడు కర్మమును ద్యజించు
నతఁడు మోక్షమున కనర్హుఁడు రాజస
త్యాగ మతనిచాగ మోగుణాఢ్య! ౮

నియతకర్మములను నిందింపక ఫలాను
రక్తి లేక సంగసక్తి లేక
యెవఁ డొనర్చు వానియీవికి సాత్త్విక
త్యాగ మన్న పేరు తగుఁ గిరీటి! ౯

ఊఁచముట్టుగఁ గర్మము లుజ్జగింప
నలవికాదు సుమా! దేహి; కతఁడు ఫలము
దెస ననాదరుఁడై కర్మదీక్ష నుండుఁ
గాక కుంతీసుతా! త్యాగిగా సుఖించు ౧౧

స్థావరములు జంగమములు
గా వెలసిన సర్వభూతగణముల నవిభ
క్తావికృతబ్రహ్మముఁ గను
ధీ విజయా! సాత్త్వికాఖ్యఁ దేర్చును బుధులన్ ౨౦

నానావిధరూపమ్ములఁ
గానంబడు జగమునందుఁ గల పరమాత్మన్
నానావిధాకృతులు గల
దానినిగాఁ దెలుపుతెలివి తగు రాజసమై ౨౧

ఈతనువే! యీ శిలయే!
యీతరువే! జీవుఁ డైన నీశ్వరుఁ డైనన్
లోఁతు లిఁక లేవు లే వను
ధీ తామసనామకం బతీవ ప్రజ్ఞా! ౨౨

ఎవనివలనఁ బుట్టు నీ భూతసముదాయ
మెవఁడు నిండి యుండు నెల్లజగతి
నతని నీశుఁ దనకు ననుకూలమగు ధర్మ
మున భజించి నరుఁడు ముక్తి వడయు ౪౬

తెలివి సెడి నేఁడు నీ వేది సలుప ననుచుఁ
బట్టుపట్టితివో యది తుట్టతుదకుఁ
బ్రకృతిసిద్ధ స్వకర్మానుబద్ధబుద్ధి
నాచరించెద వవశత్వ మంది పార్థ! ౬౦

ఫల్గునా! జగదీశుఁ డీ ప్రాణికోటి
హృదయములఁ బీఁటవెట్టినాఁ డిది యెఱుంగు
మతఁడు తనమాయచే యంత్రగతము లైన
బొమ్మలంబలె నాడించు భూతములను ౬౧

ఈవు నా నెచ్చెలివి కాన నిది ప్రతిజ్ఞ
చేసి చెప్పెదఁ బార్థ! నీచిత్త మస్మ
దభిముఖ మొనర్చి నాభక్తి నంది నను భ
జించి మ్రొక్కితివా ముక్తిఁ జెందఁగలవు ౬౫

సర్వధర్మములను జాలించి నీవు న
న్నొకని నాశ్రయింపు! ముదిలపడక
పార్థ! నిన్ను సర్వపాపముక్తు నొనర్తు
నార్తి నణఁచి నీకుఁ గూర్తు శుభము ౬౬

రచన - క్రీ. శ. ౧౯౫౭ అక్టోబరులో

కర్త - తుమ్మల సీతారామమూర్తి

# అర్థములు

అంగణము - ముంగిలి
అంగవించు - ఉత్సహించు
అగ్గపడు - వశపడు
అగ్గలించు - రేగు, పూను
అజస్రము - ఎల్లపుడు
అజుఁడు - పుట్టనివాఁడు
అతివేల - మేరలేని
అత్యయము - దోషము
అదిర - ఔరా
అధ్వరము - యజ్ఞము
అనంతుఁడు - మృతిలేనివాఁడు
అనుగత - పొందఁబడిన

అన్వితము - కూడుకొన్న
అపరిగ్రహము - పరార్థమంటమి
అపసరిల్లు - తొలఁగు
అపానము - ఒక గాలి
అపాస్త - త్రోయఁబడిన
అబ్దము - మేఘము
అభిమానము - గర్వము
అభిధానము - పేరు
అమరము - చావులేనిది
అరిది - దుర్లభము
అర్థవాదము - స్వర్గాది భోగములను మెచ్చు పలుకులు

అలంత - శోకము
అలంచు - శ్రమపెట్టు
అలము - వ్యాపించు
అలమటించు - దుఃఖించు
అలసుఁడు - సోమరి
అలుకము - అల్పము
అవధి - హద్దు
అవలేపము - గర్వము
అవస్థిత - ఉన్న
అవగుణము - దుర్గుణము
అవధరించు - ధరించు
అవికృత - మాఱని

అవిభక్త - భిన్నముకాని
అశ్రాంత - తెంపులేని
అసువు - ప్రాణము
అస్మత్ - నా
అహంత - పొగరు
అహితుఁడు - శత్రువు
అగతి - రాక
అధులు - దిగుళ్లు
అమతిల్లు - కలుగు
ఆమ్నాయము - వేదము
ఆర్జవము - త్రికరణశుద్ధి
ఆఅడివోవు - వ్యర్థమగు
ఆళి - సమూహము
ఆవళి - ,,
ఆసంగము - ఆసక్తి
ఆహవము - రణము

ఇంద్రియార్థము - ఇంద్రియ సుఖము
ఇద్ధము - పరిశుద్ధము
ఇయ్యసేయు - ఇష్టపడు
ఉక్కరి - శూరుఁడు
ఉజ్జగించు - విడుచు
ఉత్తరించి - దాఁటి
ఉదధి - సముద్రము
ఉదిలపడు - పరితపించు
ఉపరతి - శాంతి
ఉపాధి - ఆధారము
ఊఁచముట్టు - నిశ్శేషము
ఊర్ములు - అలలు
ఋజుత - సౌశీల్యము
ఋజుత్వము - ,,
ఋతి - రోఁత
ఎడ - సమయము

ఎడఁద - హృదయము
ఎడసి - దూరమై
ఎడయక - విడువక
ఎన - సాటి
ఎనయు - పొందు
ఎలమి - ఆనందము
ఎల్ల - హద్దు
ఎసఁగు - ఒప్పు, హెచ్చు
ఏనిక - ఏనుఁగు
ఏర్చు - - కాల్చు
ఒల్లమి - కోరకుండుట
ఓటమి - ఓడుట
ఓర్చి - గెలిచి
ఓహటించు - వెనుదీయు
కడంగు - పూను
కతన - వలన

కర్మచణుఁడు - పనిలో నేర్పరి
కలఁగు - కలఁతపడు
కలఁచు - కలఁతపెట్టు
కలనన్ - రణమున
కాఁపు - గృహస్థు
క్రాఁచి - తపింపఁజేసి
కీలి - అగ్ని
కీలు - రహస్యము
కుంచు - లొంగఁదీయు
కుడుచు - తిను, అనుభవించు
కుముదబాంధవుఁడు - చంద్రుఁడు
కుర్కురము - కుక్క
కూర్చు - ప్రియపడు
కృపణము - నీచము
గగ్గోలు - భయము
గరిమ - గొప్పతనము

గరువము - గర్వము
గఱువలు - పెద్దలు
చదురు - నేర్పు
చనవు - హక్కు
చయము - గుంపు
చాగము - త్యాగము
చాటు - ప్రకటించు
చాన - భార్య
చెట్ట - కీడు
చెనఁటి - చెడ్డవాఁడు
చెలువుఁడు - భర్త
చేఁత - పని
చేతన - మానసికవృత్తి
చేపడు - చిక్కు
జంగమము - తిరుగునది
జఠరము - పొట్ట

జర - ముదిమి
జాగర్య - మేల్కొనుట
జాలము - గుంపు
జిజ్ఞాసువు - తెలియఁగోరువాఁడు
జోక - సొంపు
డిల్లపడు - శక్తిహీనమగు
తక్కన్ - తప్పక
తగులు - ఆసక్తిచెందు, ఆసక్తి
తగులము - ఆసక్తి
తత్త్వము - జ్ఞానము, పరమాత్మ
తనర్చు - ఒప్పెద
తనియు - తృప్తిపడు
తనుపు - తృప్తిపఱచు
తిమిరము - చీఁకటి
తిలకించు - చూచు
తీపు - ఇష్టము

తెగడు - నిందించు
తెగి - సాహసించి
తెలుపన్ - ప్రబోధింపన్
తేజా - తేజము
తేర్చు - ప్రసన్నఁజేయు
తొఱఁగు - విడుచు
తోఁగిన - మునిఁగిన
త్వదీయము - నీది
త్రిపథగ - గంగ
దంభము - కపటము
దంష్ట్రి - కోఱ
దమము - బహిరింద్రియనిగ్రహము
దార - భార్య
దితిజాంశజుఁడు - అసుర
దీధితి - కాంతి, కిరణము
దీల్పడి - శక్తితగ్గి

దురము - రణము
దొసఁగు - నేరము
ద్వితయము - జంట
దుర్జ్ఞేయము - తెలియశక్యముకానిది
ధుని - నది
ధృతి - ధైర్యము
ధ్వజిని - సేన
నశ్వరము - నశించునది
నాన్ - అనఁగా
నింగి - అకసము
నింద - నిందించు
నింపు - "
నికరము - సమూహము
నిగ్రహించి - అణఁచి
నిధులు - కోశములు
నియుత - నియమముకల

పరుషము - కఠినోక్తి
పలుకరించు - చెప్పు
పాటవము - బలము
పీఁటవెట్టు - స్థిరపడు
పురాణ - ప్రాచీన
పేర్చు - విజృంభించు
పొడము - పుట్టు
పొడవు - రూపు
పొలియు - చచ్చు
పొలుపు - విధము, అందము
పోకారు - నశించు
ప్రకృతి - స్వభావము, క్షేత్రము
ప్రతిష్ఠ - నిలుకడ
ప్రత్యగాత్మ - పరమాత్మ
ప్రవృత్తి - కర్మమార్గము
ప్రసాదము - చిత్తశుద్ధి

ప్రాకృతము - పామరము
ప్రాణము - ఒక వాయువు
ప్రాపు - అండ
ప్రాఁబల్కు - వేదము
ప్రాము - తాచు, కప్పు
ప్రిదిలి - సడలి
ప్రోడ - సమర్థుఁడు
ఫణులు - పాములు
బలసి - చుట్టుకొని
బలె - వలె
బెగ్గడిల్లు - భయపడు
బెగ్గలించు - "
బెరయించు - చేర్చు
బ్రుంగి - మునిఁగి
భరము - బరువు
మఖము - యజ్ఞము

ముఖ - మొదలగు
ముచ్చముడుఁగు - మిక్కిలి ముడుచుకొను
ముడుఁచుట - అణఁచుట
ముముక్షువు - మోక్షముకోరువాఁడు
మెయి - రీతి, మేను
మెసవు - తిను
మెఱయక - ప్రకటింపక
మేలిప్రాపు - మంచిఅండ
మై - రీతి
మై - తో (ప్రత్యయము)
మొదవు - ఆవు
యజనము - యజ్ఞము
యోగచ్యుతుఁడు - యోగభ్రష్టుఁడు
రంగవల్లి - ముగ్గు
రెచ్చి - విజృంభించి

రోదోంతరము - భూమ్యాకాశములనడిమిచోటు
అంపిల్లు - విజృంభించు
లగ్గు - మేలు
లుప్తము - లోపించినది
లూనము - త్రుంపఁబడినది
లెంక - సేవకుఁడు
లెస్స - మేలు
లేపము - అంటు
వంశఘ్నము - కులమునుజెఱుచునది
వగ - రీతి
వనజయోని - బ్రహ్మ
వనరు - వగచు
వలచు - కోరు, ప్రేమించు
వలపు - కోరిక
వలనన్ - దెసన్

వహ్ని - అగ్ని
వాణి - వాక్కు
వారిజాసనుఁడు - బ్రహ్మ
వికృతి - వికారము
విక్రాంతి - విక్రమము
విజనోర్వి - ప్రజలేనిచోటు
విడుపు - ముక్తి
విడువని - విడువకుంట
విధులు - నియమములు
వినుతు - చెప్పెద
విప్రకారము - అవమానము
విరతి - మానుట
విరులు - పూలు
విషయము - ఇంద్రియసుఖము
విసర్జనము - వదలుట
విహ్వలించు - అల్లాడు

విహిత - విధింపబడిన
వెడ - అల్పము
వెలార్చు - వెలువరించు
వేగు - తపించు
వేద్యము - తెలియదగినది
వేరము - వైరము
వ్రేగు - బరువు
శచీవరుడు - ఇంద్రుడు
శమము - శాంతి
శర్మకరము - సుఖమిచ్చునది
శశాంకుడు - చంద్రుడు
శశి - ,,
శిఖి - అగ్ని
శేముషి - ప్రజ్ఞ
శౌచము - సదాచారము
శ్రద్ధధానుడు - శ్రద్ధకలవాడు

శ్రుతి - వేదము
శ్రోత - వినువాడు
సంగము - సంబంధము
సంచయము - గుంపు
సంచితము - సంపాదింపబడ్డకర్మము
సంతరించు - సంపాదించు
సంతనకట్టు - పూను
సంయమము - హింసాదులుడుగుట
సంసక్తి - పొత్తు
సంసృతి - సంసారము
సంహృత - చంపబడిన
సక్తి - పొత్తు
సనాతనుడు - శాశ్వతుడు
సమగ్రులు - సంపూర్ణులు
సమయు - చచ్చు
సమాధి - యోగనిష్ఠ

సమాహిత - చక్కగానిల్పబడి
సరగన - త్వరగ
సవనము - యజ్ఞము
సహస్రదీధితి - సూర్యుడు
సీమ - హద్దు
సుక్షేత్రము - కష్టము
సుధాకిరణుడు - చంద్రుడు
సుధాంశుడు - ,,
సూడు - పగ
సైపు - ఓర్పు
సొగయు - మైమఱచు
స్థావరము - కదలనిది
స్రష్ట - సృష్టికర్త
స్విన్నా - అలసినవాడా
హంత - చంపువాడు
హృష్టి - సంతోషము

# మా కృతులు




తుమ్మల సీతారామమూర్తి
అప్పికట్ల P. O.
(వయా) బాపట్ల (గుంటూరుజిల్లా)